శ్రీ రామాయనమః

# భక్తకల్పద్రుమ శతకము

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

వాసుదాస స్వామి



శ్రీరస్తు

# శ్రీ భ క్త క ల్ప ద్రు మ శ త క ము.

==========

వా సు దా స వి ర చి త ము



మొదటికూర్పు, 2000 ప్రతులు

చెన్నపురి :
బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
==========
1930.
దీని వెల, 4 అణాలు

ప్ర కా శ కు లు.

శ్రీ కో ద ం డ రా మ భ క్త సే వా స మి తి
శ్రీరామసేవాకుటీరము
ఒంటిమిట్ట, కడపజిల్లా.

# శ్రీ భక్తకల్పద్రుమశతక పీఠిక.

============

ప్రమోద సంవత్సర చైత్ర శుద్ధ చతుర్దశినాఁ డొంటిమిట్ట యందలి శ్రీకోదండరామ స్వాములవారి సామ్రాజ్యపట్టాభిషేకము నుద్దేశించి యీశతకము వ్రాయఁబడెను. పదిసంవత్సరములుగఁ గైంకర్యార్థియై వాసుదాసుఁడు సంచారముచేయు కాలమున లభించిన కొన్ని యనుభవము లిందువ్రాయఁబడెనేకాని యవియును నన్ని చెప్పఁబడవయ్యె. చెప్పినవి చాల సూత్రప్రాయముగ నుండుటచే నవి పాఠకులకు సుబోధములని చెప్ప వలనుపడకున్నది. ఈరెండు లోపములను బూరించి పీఠికగ వాసుదాస జీవితనాటకమందలి చతుర్థాంకము చేర్పఁ దలపెట్టఁబడెనుగాని యూరుస్తికాయంత సిద్ధాంతము తాటికాయంత యనుసామెత నిజమగుననియు మున్ముందు కొన్నివిషయములు చెప్పరాకుండుటయుఁ దలపోసి యట్టి పీఠికయుఁ జేర్పఁబడదయ్యె. ఈకొఱఁత మున్ముందు భక్తిసంజీవని తీర్పఁగలదని తోఁచుచున్నది. దైవసంకల్ప మెట్లున్నదో. ఇప్పటి కిలోపములను బాఠకులు క్షమింతురుగాక.

ఇట్లు : విన్నవించు
దాసోహమ్
వాసుదాసుఁడు.



# శ్రీ భక్తకల్పద్రుమశతకము.

==========

శా. శ్రీకల్యాణగుణాప్పతీ రఘుపతీ
శ్రీభక్తసేవాదృతీ
క్ష్మాకన్యాహృదయాబ్జవాసరపతీ
సాధువ్రజౌకోగతీ
శ్రీకారుణ్యరసాకృతీ గురుమతీ
సేవింతుఁ గల్యాణముల్
మాకుం గూర్పవె యొంటిమిట్ట
రఘు రామా భక్తకల్పద్రుమా. 1

మ. వరధీభాగవతుల్ స్వకీయుఁ డనుచున్
భాషించిసంగాక నీ
కరుణాపాత్రుఁడు గాఁ డెవండు; గిరిజా
కాంతుండు చేపట్ట నీ
చరణావాసముఁ గాంచెఁ జంద్రు; డటు
తత్సాంగత్యముం గూర్పుమీ
స్మరియింతు న్నిను నొంటిమిట్ట
రఘురామా భక్తకల్పద్రుమా. 2

మ. వరదా ! తావకదాసవేషమును దాల్పం
దొంగయేన్ నత్సుధీ
వరసంపూజ్యతఁ గాంచు ; నీనఖర
రూపం బూనుటం దా మహే
శ్వరుఁడున్ శీర్షమునందుఁ దాల్చెను
నిశాచారున్ శశిన్ ; దుష్టసం
హరణా ! ప్రోవవె యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 3

మ. ద్విజరాజై చెలువొందుగాఁక యమృతాబ్ధిం
బుట్టి మిన్నందుఁ గా
క జగత్ప్రాణుల కోదనంబు నిడుతన్
ఖ్యాతంబుగా ధాత్రి స
ద్ద్విజసాంగత్యము గల్గుఁగాక తన
ప్రారబ్ధంబు తప్పింప రా
దజసోదర్యున కైన దుర్భవ
విరామా ! భక్తకల్పద్రుమా ! 4

శా. ఆకాలాంబుదనీల దేహరుచితో
నాస్మేరవక్త్రంబుతో
నాకోదండకరంబుతో నభయ
ముద్రాలక్ష్యహస్తంబులతో
నాకందోయికిఁ గానవచ్చు టెపుడో
నాళీకపత్రేక్షణా
క్ష్మాకన్యావర ! యొంటిమిట్ట
రఘురామా! భక్తకల్పద్రుమా! 5

శా. నిక్కం బేను వచించెదన్ రఘుపతీ !
నీపాదముల్ సాక్షిగా,
దిక్కే నీవని నమ్మినాఁడ, మది
నేదిన్ గోర నీదాస్యమున్
దక్కన్ ;గేలనొ కాలనొ నుడులనో
త్వద్బుద్ధిఁ జేయించుకో
చక్కం దానినె యొంటిమిట్ట
పురువాసా ! భక్తకల్పద్రుమా ! 6

శా. ప్రావీణ్యంబున సర్వవేళలను
నీపాదంబుజద్వంద్వసం
సేవాకార్యమున్ దక్క వేఱొకటి
కాంక్షింపం జుమీ; ముక్తియున్
నీవైకుంఠము దివ్యభోగములు
నీవే యుంచుకో, కాన ర
మ్మా వాంఛించినవేళ నేను,
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 7

శా. కావంరాఁగదె న న్నటంచుఁ బలుకంగా
నేర, నీసొత్తులన్
నీవే కా పొనరింపు మంచు ననఁగా
నే నెవ్వఁడన్ ? శాస్తనా ?
యీ వేమజ్ఞుఁడవా? ప్రమత్తుఁడవొ?
నీయిష్టం బె నాభాగ్య; మో
మావామాధవ ! యొంటిమట్ట
రఘురామా! భక్తకల్పద్రుమా! 8

శా. లేదా జానకి, లేఁ డె నాయనుజుఁడున్
లేఁడా హనూమానుఁడున్
నాదాస్యంబున కేల నీ వనకుమా
నాతండ్రి ! యవ్వారిచే
కా దూళ్లన్ మఠి పల్లెలుం దిరిగి
నీఖ్యాతిం ధరన్ సత్కృతిన్
బాదుంగొల్పఁగ నొంటిమిట్ట
రఘురామా! భక్తకల్పద్రుమా! 9

మ. రవిబింబును మూర్ధ మెత్తి
కననేరన్ లేనితిర్యక్కులా
రవి తేజం నిజంబు, లేఁడు రవి. యన్
చందంబునన్ గొందఱీ
యవనిన్ సత్యము నీదు తేజమె, యసోహం
బీ వటంచందు రో
యువనీజాధిప ! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 10

శా. ఏనాఁడో కదె నే ధరించుటలు తండ్రీ
నాదుమూర్ధంబునం
దానీరేజభవార్చితంబులు రమా
హస్తాబ్జసంసేవ్యముల్
ఆనాళీకదరారికల్పకులిశా
ద్యాలంకృతంబుల్ త్వదీ
యానూనాంఘ్రులు నొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 11

శా. నీనామం బె జపింపఁ బల్కె సతికిన్
నీనామమే పల్కెడిన్
బ్రాణాంతంబున దేహికిం జెవిని
నీపాదంబువుల్ దాల్చెడిన్
నీనవ్యాంఘ్రి శిరంబుఁ జెర్చె హరుకంటెన్
వైష్ణవుం డెవ్వఁడో
క్ష్మానాథాదిప! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 12

శా. నిన్నే తప్ప మఱెవ్వరిం గొలక
నిన్నే తప్ప వేఁడేదియేన్
దెన్నుం బూనక, తావకీనపదప్రాప్తిం
దక్క వేఁడేదియే
నెన్నంబోక కృతాత్ముఁ డుండుస్థలి
కౌనేసాటి యాకాశియేన్
మన్నాథా ! హరి ! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 13

మ. అవనీచక్రము సంచరించినను
బ్రాణాయామమున్ జల్పినన్
నవరంధ్రంబుల గెల్చి యుప్పిఁడిని దిన్నన్
గామరోషాళులన్
వివశుండౌను భవత్పదాబ్జముల
సేవింపంగ లేకుండినం
భవధాత్రీడిత యోగియేని
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 14

శా. నాదాస్యంబున నేమిరా మహిమ
గానం గల్గితీవన్న రా
మా! దాస్యంబు స్వభావసత్త యది
యౌcగా జీవి; కామ్నాయముల్
ఆదోవల్ కద యన్నిమార్గముల
శ్లాఘ్యంబంచు శాసించు; బ్ర
హ్లాదామోదక ! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 15

శా. నాకేలా భవదీయదాస్యమున
నౌనష్టంబు లాభంబు నా
లోకింపన్, శ్రుతులున్ విధించును
రమాలోలాక్షి సౌమిత్రులున్
నాకౌకోముని పాపమాని, గిరిజా
ప్రాణేశధాత్రాదులున్
ఆకాంక్షించెద రేల పల్కు
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 16

శా. నీకైంకర్యము బ్రహ్మరుద్రముఖరుల్
నిత్యంబుc గాంక్షించినన్
క్ష్మాకన్యాపవమాననందనులకున్
సౌమిత్రిన్ వెండియున్
నాకుం బోతకవీంద్రచంద్రమునకున్
గా కొర్లకుం గల్గనే
క్ష్మాకాంతిధిప ! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 17

శా. నీదాస్యంబున మీcదc గల్గుఫలమున్
గీర్తింప నెట్లౌ మహా
మోదంబారcగ సర్వవర్ణముల
స్త్రీపుంసంఘముల్ ధాత్రిపై
నౌదార్యంబున గారవించిరి
త్వదీయప్రేష్యతం దాల్పనే
నాదిత్యాన్వయ యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 18

శా. శ్రీశా ! త్వత్పదభక్తియుక్తనర
నారీపాదభూమిరజో
లేశం బౌదలc దాల్చుధన్యునకు
ధాళద్ధళ్యమాణిక్యకో
టీశుంభన్మకుటోజ్జ్వలచ్ఛిరుని
సాటిన్ జెప్పరా దెప్పుడున్
దాశార్హా ! హరి ! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 19

మ. కరుణాబ్ధీ! భవదీయపాదగ
పరాగంబుం దలం దాల్చినన్
నరకావాసభయంబు లేదు,
నవరత్నప్రోజ్జ్వలత్కాంచునో
ద్ధురమైనట్టి కిరీటమూనినను
దోడ్తో నారకావాసియౌ
స్మరవైరీడిత యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 20

శా. ప్రత్యక్షంబుగ నిల్చినట్టినినుఁ
గొల్వంలేక పట్టంధువుల్
సత్యం బేదొ మఱెందొ యున్నదనుచున్
జల్పింత్రు మౌఢ్యంబునన్
ప్రత్యక్షాన్నము వీడి దున్నుటకుఁ
గానం జేరు మూర్ఖుంబలెన్
సత్యావల్లభ ! యొంటిమిట్ట
పురవాసా ! భక్తకల్పద్రుమా ! 21

మ. నిను నేఁ బాడిన వీనులన్ వినిన
నిన్నేఁ బల్కినన్ వ్రాసినన్
నిను ధ్యానించిన నర్చనల్ సలిపినన్
నిల్వంగదే మ్రోల నేఁ
గనులన్ విచ్చిన మూసినన్ జడిగొనం
గన్నీరు డగ్గుత్తికన్
దనరన్ మేన్పులకింపఁ జేసి
రఘునాథా ! భక్తకల్పద్రుమా ! 22

శా. నావాఁ డీతఁ డటంచు నీమనమునం
బాటించినం జాలు నో
దేవా ! యేమిభయంబు నా కవల
నెందే నున్న నేయోనియం
దావిర్భావము గొన్న నే దశలు నన్
బ్రాప్తించినన్ బ్రక్కతో
డై వర్తింపగఁ నెప్పు డీవు
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 23

శా. నీమాహాత్మ్య మెఱుంగ లేనికుమతుల్
నిన్ను న్నరుం డంచుఁ దా
మేమో వాఁగిన వాసి యేమిచెడె
నీకేన్ నీదుభక్తాళికేన్
శ్రీమంతున్ శశి నప్పళం బనినచోఁ
జేటొందునే చంద్రుఁడున్
ఆమోదింపవె జీవసంఘములు
రామా! భక్తకల్పద్రుమా ! 24

శా. ఏయోయోని జనించిన్ జగతి
నేయే దేశమం దుండినన్
ఏయేకష్టదశ ల్లభించినను
దండ్రీ ! వాఙ్మనః కాయముల్
ఏయే వేళలనైన నీకొలువునందే
నిల్వఁగాఁ జేయవే
యాయామానవ యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 25

శా. వీనుల్ నీచరితంబులన్ వినఁ, గనుల్
విశ్వేశ నీరూపమున్
గానన్, నాస త్వదీయపాదతులసిన్
ఘ్రాణింపఁగా, జిహ్వమున్
నీనామంబె స్మరింపఁ, బూజనలుపన్
గేల్, కాళ్లు నీకై చనన్,
మానాథా ! ఘటింపమే కరుణ
రామా ! భక్తకల్పద్రుమా ! 26

శా. కాయంబా భృశరోగపీడితము
యోగం బూనఁగా లేను, దు
ర్జేయం బాత్మవిచారముం జలుపఁగా
నే నేర, ధర్మావళిన్
జేయం జాలను; లేను భక్తి నలుపన్ ;
నీనామమే వాఁగెదన్
వాయారన్, భవదిష్ట మాపయిని
దేవా ! భక్తకల్పద్రుమా ! 27

మ. బలమున్ జ్ఞానము లోనుగా సుగుణముల్
వర్తిల్లు నీయందుఁ బె
క్కులు, నాకేమిఫలంబు వానివలనన్
గూడున్ ? క్షణం బందు ల
క్షలు పాపంబులు సేయువాఁడను
మహాఽసంపూర్ణకుక్షిన్ దయన్
వలతున్ రక్షగ,నొంటిమిట్ట
రఘుదేవా ! భక్తకల్పద్రుమా ! 28

శా. పారం బన్నది కానరాదు గన
మత్పాపాబ్ధికిన్, ద్వద్దయా
పారావార మనంత, మీయుభయముల్
వైరుల్ సదా పోరెడిన్
శౌరీ! మానముఁ గాచుకో
మదఘనాశం బారఁ గావించె ప
ద్మారామాలయ ! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 29

శా. నీయం దెవ్వఁ డసూయపూనిన హరీ
నిర్మూల మౌ వాఁడు మున్
చేయం గల్గినసర్వపుణ్యములు;
లక్ష్మీనాథ యారేణుకా
దాయాదార్జితపుణ్యలోకములు
వ్యర్థం బార నాశిల్లెఁగా
మాయామాణవకా మురారి
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 30

శా. వారున్ వీరును వేల్పుఁబెద్ద లనుచున్
భాషించుటల్ మౌఢ్యమే
యౌ, రామా కరిరాజు పీడపడి
హాహాయంచు వాపోవఁ బా
కారి,ప్రోద్భవుఁడుం ద్రిలోకముల
నల్లాడంగ రక్షార్థియై
వారున్ వీరును బోయిరెందు
రఘుదేవా ! భక్తకల్పద్రుమా ! 31

శా. అర్చాకారుని నిన్నుఁ గాంచి మతి
హీనాగ్రేసరుల్ దుష్కృతుల్
చర్చల్ చేయుదు రయ్యొ నిన్ను నొక
శైలం బంచుఁ దత్పాపమే
యేర్చున్ వారిని నారకాగ్నులను బక్కేఁడుల్
రమానాథుఁ డం
చర్చల్ సేసెద నొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 32

మ. భవదీయాంఘ్రిసరోజపాంసులవ
సంస్పర్శంబునం గాక ద
క్కు విధిన్ మాయదు జారతాఘము
మహాఘోరంబు; తత్తల్మి మే
లువడెన్ గౌతమపత్ని,రావణుఁడు
గోల్పోయెన్ యశ్రశ్శీతనూ
భవవంశంబుల దానిలేమి
రఘుదేవా ! భక్తకల్పద్రుమా ! 33

మ. కరుణాసాగర నీదుసేవరుచి
సౌఖ్యం బెన్నఁగా లేని ము
ష్కరుఁడే గోరును దారిగేహధన
యోగజ్ఞానకర్మాదులక్ ;
సరుకుంజేయఁడు వాని విజ్ఞుఁ డెపుడున్
సౌమిత్రియున్ రావణా
వరజుండున్ గపి నల్పినట్లు
రఘుదేవా ! భక్తకల్పద్రుమా ! 34

మ. అనుజుండై భజియింప నొల్ల,
సతినై హర్షింపఁగా నొల్ల, నీ
జనకుండై మన నొల్ల,మాతృతయు
సంశ్లాఘింపఁ బుత్రత్వమున్
గన నొల్లన్, భవదంఘ్రిదాస్య మొకఁడే
కాంక్షింతు నెల్లప్పుడున్
హనుమంతుంబలె, నొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 35

మ. సతియై యేమి సుఖించె సీత ?
తలి యేసౌఖ్యంబులం గాంచె ? నీ
సుతులున్ మోదముఁ గాంచిరే ?
యనుజులున్ శోకంబు లేకుండిరే ?
క్షితజాటుండు భవత్పదాబ్జయుగమున్
సేవించి సామిరి స
మ్మతి బ్రహ్మత్వమునొందుఁ గాక
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 36

మ. అమలజ్ఞానసమాధియోగతపముల్
ధ్యానాదులున్ వేలజ
న్మములన్ సల్పి యపాస్తకుండఁడయినన్
మానాథ నీపాదప
ద్మములన్ భక్తి జనింపఁ దన్మహిమ
మోదం బందు నీతుల్యుఁడై
యమరారాధిత యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 37

శా. లాభంబుం బరికింప లేక ధన
చేలక్షేత్రధాన్యాదులన్
లోభుల్ వీడఁగ లేరు గాక మతిశీలు
ర్గాన సర్వస్వమున్
నీభక్తుల్ విడనాడి నీకు నయి
నిన్నే నమ్మి యందందు దే
వా భోగించెద రెల్లసౌఖ్యములు
రామా ! భక్తకల్పద్రుమా ! 38

శా. నీతో నాకుఁ బనేమిరా రఘుపతీ !
నీనామమున్ గల్గఁగా?
నాతప్పుల్ క్షమియించి సర్వశుభముల్
నాకుం ఘటింపన్ సత
త్రాతా ! ద్రౌపది నామముం దలఁచి
నంతన్ గల్గె శ్రేయంబు మున్
దైతేయాంతక యొంటిమిట్ట
రఘునాథా భక్తకల్పద్రుమా ! 39

శా. స్నానంబుల్ జపముల్ తపంబులును
సంధ్యల్ నిత్యకర్మావళుల్
నీనామంబున కీడు గావు భవ
పాళింద్రుంపఁగా లేమి; రా
మా! నీనామమె యెక్కటిం* దునుము
జన్మశ్రేణి భూతాళికిన్
క్ష్మానాథా ! హరి యొంటిమిట్ట
రఘురామా! భక్తకల్పద్రుమా! 40

మ. ధనముల్ గావలె దానధర్మములకుం,
దత్త్వార్థవిజ్ఞానికిన్
దనరం గావలెఁ బండితుల్,తనువు
సందార్ఢ్యంబు నాచార్యుఁడున్
బొనరం గావలె యోగవిద్యకును
నిన్నుం బేర్కొనం నాల్క
యున్నను జాలుం గద యాశ్రితాభయ
నిదానా భక్తకల్పద్రుమా ! 41

శా. ఆమోదంబు జగంబు నిండినను,
రమ్యాకారముం దాల్చినన్
స్వామీ తేఁటులు తేనె గ్రోల గుములై
నానాదిశల్ నుండియున్
దా మేతేర భవత్సమీపజనదండం బట్లు
తమ్మిన్ గుణం
బామండూక మెఱుంగ లేదు
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 42

శా. నీసాన్నిధ్యమునందు నిల్వఁగను
నిన్నే యొప్పుడుం గొల్వఁగా
నీసేవల్ పొనరింప సత్కృతితతుల్
నీకై సమర్పింపఁగా
నాసంకల్పము; నీవు నిండు దయచే
నాకోర్కులం దీర్పుమా
దాసోహమ్మని యుండువాఁడ
రఘునాథా ! భక్తకల్పద్రుమా ! 43

శా. ఏ నీసేవకుఁ గానొ యోగ్యుఁడును
నాకృత్యంబు నీవొల్లవో
దేనిన్ గోరునొ వీఁ డటంచు మది
భీతిం జెందితో జానకీ
జానీ చిత్తము విత్తమున్ దనువు
నాసర్వంబు నీకిచ్చినన్
మానం జూడవు కిన్క వీనిపయి
రామా భక్తకల్పద్రుమా ! 44

శా. సోహమ్మందును గొంద ఱాడుదురు
తథ్యాతథ్యతద్వాదముల్
ఊహాపోహలు నాకు నేల
పనిలేకున్నట్ట యాసోము* హే
మా హేమీలు ఘటాఘటీలు
రణసీమం జావఁగా నిమ్ముదా
సోహ మ్మంచుఁ దరించువాఁడ
రఘురామా భక్తకల్పద్రుమా ! 45

శా. ఆనందానుభవంబె శ్రేయమొ
త్వదీయైక్యంబె ప్రేయంబొ నా
నానందానుభవంబె శ్రేష్ఠమని
సిద్ధాంతంబు ప్రాగ్విద్యలన్
దేనెల్ తేనెల తీపెఱుంగఁ గలవే
దేవా నిరావందని
ర్వాణం బేజడుఁ డిచ్ఛగించు
రఘువీరా భక్తకల్పద్రుమా. 46

శా. స్వామీ నీయిలు నిల్ప సుస్థితిని
వాంఛం జేసి యూరూరునున్
గ్రామగ్రామము నిల్లునిల్లు నిటు
భిక్షాచర్య నల్లాడ శ్రీ
ధామా యేమని వ్యాధి నేఁచెదు
దయాదాక్షిణ్యము ల్లేక ; సు
త్రామాదాస్తవనీయ శీల
రఘునాథా భక్తకల్పద్రుమా ! 47

శా. కూడున్ వీడితి, గుడ్డ వీడితిని,
నాకున్ మున్ను నీవిచ్చునా
వీడున్ నీకె యొసం గితిన్,ధనమునం
వీసంబునున్ దాఁప, నేఁ
గాడున్ వీడును రెండు తుల్యములు గాఁ
గన్గొంచు నీసేవ చ
ల్లాడంగాఁ గినియంగ నేమిటికి ?
రామా ! భక్తకల్పద్రుమా ! 48

శా. వాసో గ్రాసము లాసచేయ నినుఁ
గొల్వం,జీతమున్ బత్తెమే
నాసం జేయను, క్షేత్రధానధన
గేహారామభృత్యాళులన్
గౌసల్యాసుత! దివ్యభోగములఁ
గాంక్షల్ సేయ, వందారునై
దాసోహమ్మని యుండు వాఁడ
రఘునాథా భక్తకల్పద్రుమా ! 49

శా. ఓరీ యేటికి నన్ను దూఱెదువురా
యుష్మత్కృతాఘంబు ని
న్నీరీతిన్ వ్యథపెట్టుచున్న దనుదే,
నీసర్వశక్తత్వ మా
క్రూరాఘంబును ద్రుంపఁ జాలనియెడన్
గోదావరిం ద్రోయరా
సారంబేదిన బిర్దులేల
జగదీశా భక్తకల్పద్రుమా ! 50

శా. పరధర్మంబు భయావహం బనుచుఁ
దెల్పం గాదె జాతిన్ ధరా
మరుఁడై క్షాత్రము గొన్న రేణుకసుతున్
మాయించి తద్గర్వమున్
పరధర్మార్జితపుణ్యలోకచయమున్
ధ్వంసంబు గావించుటల్
స్మరవైరీడిత యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 51

మ. కులధర్మంబు నశింపనీ, జనకులుం
గోపింపనీ, బంధువుల్
చులుకంగాఁ గననీ, ధనంబు యశమున్
శూన్యంబుగానీ, విని
శ్చలభక్తిం హృదిఁ దావకీనపదముల్
స్థాపించుపుణ్యుండెపో
మలయుం బ్రహ్మగిరీశపూజ్యుఁ
దయి రామా! భక్తకల్పద్రుమా ! 52

మ. ఎవి నాకంటికి గోచరించిన,మనం
బెందెందుఁ దా నేగినన్
అవి యెల్లం బ్రణతార్తినాశ !
భవదీయాకారముల్ ; మచ్చిరం
బవనిన్ వ్రాల్చినచోటులెల్లను
త్వదీయాంఘ్రిద్వయం బిట్టులో
యవనీజేశ దృఢాస్థ నిమ్ము
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 53

శా. నాసంచారము నీప్రదక్షిణముగా
నాభాషణంబుల్ రమా
వాసా నీవగుస్తోత్రపాఠములుగాఁ,
బానంబు స్నానంబుగా
గ్రాసం జోలి నివేదితోదనముగాఁ
గార్యాళి నీసేవఁగా
దాసోజ్జీవనశీల! కొమ్ము
రఘునాథా భక్తకల్పద్రుమా ! 54

శా. నీలోనన్ వసియించెదన్ సతతమున్,
నీలోన నిద్రించెదన్
నీలోఁ దిందును విందు మందు నడతున్
నీలోన, నిట్లయ్యు నీ
జాలంబో హరి నాదుపాపబలమో
సర్వాత్ముని న్గానఁగాఁ
జాలన్, మందుఁడ నొంటిమిట్ట
పురవాసా భక్తకల్పద్రుమా ! 55

శా. కానన్ రానని యేల దూఱెదు
వరాకా ! గ్రుడ్డివా? యోరి యీ
కానన్ వచ్చుపదార్థజాలములు నేఁ
గానా? ప్రపంచార్థమై
నానావేషము లూని నంత
మతిహీనా ! గుర్తపట్టంగ లే
వా నన్నంచని యాడవోటు
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 56

మ. అలనాఁ డాశ్రమసీమ నేను భవ
దీయాకారమున్ జూపఁ గాం
క్షలు సేయం, గల వీరరాఘవ
సమాఖ్యం జూపు నారూప మా
వలఁ బ్రత్యక్షపునీదురూపు
నొకటై వర్తిల్లు ధన్యుండనై
యలరం గంటిని నొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 57

శా. శ్వానంబుల్ గుఱుతింపఁగాఁ గలవు
స్వస్వామిన్ విరూపంబునన్
దా నేతెంచిన, విశ్వరూపు రఘు
నాథా ! నిన్ను గుర్తింపఁగా
నే నేరన్ మఱి యెందుఁగాఁ దలఁతుఁ ;
దంద్రీ ! కుక్కకున్ హీనుఁడన్
మానాథా హరి యొంటిమిట్ట
రఘురామా భక్తకల్పద్రుమా ! 58

మ. అశనాయాపరిపీడితాంగు నినుఁ
గన్నారంగ నేఁ గాంచి యున్
అశనం బిమ్మని నీవు వేఁడిన, మహా
పాపుండఁ గడ్వారఁగా
నశనం బీయఁగ నేరనట్టిపశువన్
హో కాల్పనా నన్ను ? నో
దశకంఠాహిత యొంటిమిట్ట
రఘునాథా భక్తకల్పద్రుమా ! 59

మ. అల చేజెర్లను గొల్లయక్క మకుఁ
ద్రత్యక్షంబవై దాసరై
యలరం జేసితి నాకు ముం దరిగి,
నీ వారూపమున్ నాదుచ
క్షులకుం గన్పడఁ జేయవైతివిగదా
క్రూరుండఁ బాపాత్ముఁడన్
అలసుండన్ హరి యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 60

శా. రామా రాఘవ రామచంద్ర రఘు
వీరా రామభద్రా రమా
రామా రామ రఘూత్తమా
రఘుపతీ రాజన్మహీకన్యకా
రామా! యంచు స్మరియించుటం
దరుగనీ రాత్రుల్ దినంబుల్ క్షణం
బై మానాయక యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 61

శా. నీవై రమ్మని నన్నుఁ బిల్చుదనుకన్
నీసేవలం జేయఁగా
లావుం దేజము బుద్ధి యోపిక
నిరాలస్యంబు దార్ఢ్యంబు నా
కీవే కన్నులఁ గాలఁ గేల మదితో
నెల్లప్డు సేవింతు నీ
తావామాధవ ! యొంటిమిట్ట
రఘునాథా ! భక్తకల్పద్రుమా ! 62

శా. నీదాసుం డని విశ్వసించి పురుషుల్
నీరేజపత్రేక్షణల్
మోదం బారఁగ నిన్నుఁ గొల్చెడిగతిం
బూజించి రయ్యా ననున్ ;
నీదౌసన్నిధి వీరి నిల్పుము దయన్ ;
నీయప్పనుం దీఱెడిన్
ఔదాసీన్యము పూనకయ్య
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 63

శా. ఏయేతల్లియు నాకుఁ బాలిడియెనో
యేతండ్రి పండ్లిచ్చెనో
యేయేవారు సమాదరించిరో
భవ ద్భృత్యుండ నంచున్ దయన్
ఆయావారికి నవ్యయం బయిన
నిత్యానందముం గూర్పుమీ
మాయాయ్యా కృప నొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 64

శా. ధ్యానాసక్తులు యోగమార్గమున
హృత్పద్మస్థమౌతేజమున్
గానం గాసి పడంగ నిమ్ము
మిథిలాకన్యేశ ! తన్మధ్యగం
బౌనీనీలసురూపముం గనఁగ
నభ్యర్థింతు నీనామమే
యౌ నాకుం గతి యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 65

శా. ఏచాయల్ గన నీదుదేహరుచులే,
యేవెన్నెలం గాంచినన్
నీ చిర్నవ్వులె, యేతటిల్లతలు నేన్
నీమేని లావణ్యమే
యేచక్కందనమైన నీసొగసె
యేయేవాక్యముల్ విన్ననీ
వాచారంభమె యొంటిమిట్ట
రఘుదేవా భక్తకల్పద్రుమా ! 66

శా. అద్వైతం జని ద్వైత మంచును
విశిష్టాద్వైత మంచున్ వృథా
విద్వాంసుల్ కలహించుచుందుదు రయో
విద్వేషధీమూఢులై
అద్వాచ్యన్* నినుఁ గొల్చుభక్తజను లో
యాపోంతలం బోవరో
యద్వైతా ! సదసత్స్వరూప
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 67

శా. నీవున్ సత్యము, నేనునున్ నిజమ,
తండ్రీ ! స్వామివిన్, దాసుఁడన్
నీవున్ నేనును, నేను నావి యను
వానిన్ సర్వమున్ నీవె; నీ
సేవార్థంబు గ్రహించి ప్రీతిపడి
నాచే సేవ చేయించుకో
క్ష్మావామాధవ! యొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 68

శా. దారం గూడితి, బిడ్డలం బెనిచితిన్,
ద్రవ్యంబు నార్జించితిన్
పేరుం గంటిని, భూరిసౌధములలోఁ
బెంపార భోగించితిన్
సారం బేదినఘోరదుర్గహన
సంసారంబు హేయంబుగా
నారం దోఁచెడు, నొంటిమిట్ట
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 69

మ. మృదుతల్పంబులమీఁదఁ బండటకునున్
    మేల్దోఁచె భూశయ్య, స
న్నదుకూలంబులకంటె దిగ్వసనమే
    నాణెంబు, మృష్టాన్నమున్
ముదమారం దినుకంటెఁ బాలు ఫలముల్
    మోదంబిడెన్ ,భక్తకా
మద ! సంత్యాగము శ్రేయ మార్జనకు
    రామ ! భక్తకల్పద్రుమా ! 70

మ. మనమా నిల్వదు ధ్యాననిష్ఠ కని
    సంసారుల్ వగం జెందఁగాఁ
బనియేమి ? తమచేయుకర్మములు
    సర్వంబున్ భవత్ప్రీతిగా
నొనరింపం సతతంబు దుష్కరము
    నౌయోగంబు సాధింపఁగన్
బనియేమీ మఱియొండు?
    దుష్కృత విరామా భక్తకల్పద్రుమా ! 71

మ. మనసు న్నిల్ప విరాగిమానవులకున్
    మార్గంబు చిత్తంబు దాఁ
జను నెందెందుఁ దదీయవస్తువుల
    త్యాజ్యంబే సుఖోదర్కమౌఁ
జన నాకర్షించెడి వస్తుభావమున
    స్వస్థానంబునన్ నిల్చి యుం
తన నీవై పగు; నొంటిమిట్ట
    రఘుచంద్రా భక్తకల్పద్రుమా ! 72

శా. ప్రాణాయామము నేర్చి, యాసనము
    లభ్యాసంబుఁ గావించియున్
మీనాంకుం బరివారయుక్తుని మదిన్
    వేఁటాడి పోఁద్రోలి, నీ
ధ్యానాసక్తత,నామనంబు భవదీయ
    ప్రేష్యభావంబునే
తా సేసించెడి స్వాదువంచు
    రఘునాథా ! భక్తకల్పద్రుమా. 73

శా. నీకైంకర్యము వీఁడు సల్పునెడఁ దండ్రీ !
    నీపయున్ భక్తినో
నాకైకూర్చినవత్సలత్వమునవో
    నానాజనుల్ సాహ్యమున్
సాకల్యంబుగఁ గూర్చి రట్టిరకుఁ
    దచ్ఛ్రద్ధానుసారంబు దే
వా కల్యాణముఁ గూర్పవయ్య
    రఘుదేవా ! భక్తకల్పద్రుమా. 74

శా. కేలి న్మోడ్చి వచింతు,నీవు తమి
నంగీకారముం జేసినన్
జాలున్ నాపరిచర్య, వేఱుఫల
మాశంజేయఁ ; ద్వత్సేవచే
నేలగ్గౌ నది మద్ధితైషులకు
నీవే యిమ్ము,మోదించెదన్
వాలాయంబుగ నొంటిమిట్ట
రఘుదేవా భక్తకల్పద్రుమా. 75

మ. అది యేలా ? యనఁ దా గడించినవి
రుచ్యంబుల్ పదార్థంబులన్
ముదమారన్ హితపుత్ర పాళి కిడియే
మున్ముందుఁ దచ్ఛేషమున్
గద తండ్రీ జనకుండు గైకొనెడు,
నీ కారుణ్యముం గల్గ నే
యదనం దేమికొఱంత నాకు?
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 76

శా. కైంకర్యంబును నేను జేయ మది
సంకల్పింపమీ; సేవలున్
శంకాతంకము లంతరాయములచే
జాగొందకుండం దమీన్
సంకల్పింపుము, వాని నీవు గొనఁగా
సంకల్పముం జేయుమీ
పంకేజాసనశర్వవంద్య ! రఘుదేవా!
భక్తకల్పద్రుమా ! 77

మ. కలికాలంబుమహత్త్వ మేమొ దశవక్త్ర
ప్రేష్యులున్ వంశజుల్
కలయన్ జన్మము గాంచి మానవ
సమాకారంబులన్ ధాత్రి నె
గ్గులు నిన్నాడుచు సంస్తుతించెదరు
రక్షోనాథునిన్ భావిచి
హ్నాలు నీరాక కటంచు నెంచెదను
రామా ! భక్తకల్పద్రుమా ! 78

శా. ఆరాముం దజసూతిసూర్యజనుతి
వ్యాహారహృష్టాత్ముఁడున్
ఈరాముండజసూతిసూర్యజముఖ
వ్యాహారసంహృష్టుఁడున్
ఔరాపుణ్యజనార్దనద్వయిని
భేదాభావముం దెల్పఁగా
శ్రీరాముం డని పేరుఁ గాంచితిని
తండ్రీ భక్తకల్పద్రుమా. 79

మ. పరధర్మస్థిత రేణుకాతనయుఁ జంపన్
 బూని తత్పుణ్యముల్
హరియింపన్ శర మేసి తీ; విపుడు
 స్వీయబ్రహ్మధర్మస్థు నా
దురితంబుల్ సుకృతంబులుం జెడఁగఁ
 దోడ్తో వేయరా బాణముల్
శరచాపాంకితహస్తపద్మ
 జగదీశా ! భక్తకల్పద్రుమా ! 80

మ. గుణవార్ధీ ! శ్రితజీవకోటియెడ
 నీకుం గల్గు కారుణ్యమున్
గుణియింపన్ మతి లేనివారు సతికై
 కామార్తి దుఃఖించి తం
చణుమాత్రంబును శంకలే కనుదు
 రయ్యా తత్త్వబోధాంధులై
ప్రణుతార్తిప్రవినాశశీల
 రఘువర్యా ! భక్తకల్పద్రుమా. 81

శా. వానప్రస్థున కేల సొమ్ము లనుచున్
 వర్జించి సర్వంబు నీ
వూనన్ గారణ మేమి ముద్రికను?
 భావ్యూహంగదా? రెండుమా
ర్గానీచున్ ఖలుఁ దాటకాతనయుఁ
 బ్రాణాపాయముం గూర్పవే
లా నాకున్ వచియింప వయ్య
 రఘురామా భక్తకల్పద్రుమా. 82

శా. నీకారుణ్యము సాటి లేదు పగతున్
 వీక్షించుటన్ గూర్మిచే
నీకాఠిన్యము సాటిలేదు సతినిన్
 నిష్కారణం బేఁచుటన్
నీకుం దాసుఁడ నెట్లు చేసెదవొ
 న న్నీ రేజపత్రేక్షణా
నాకాధీశనతాంఘ్రిపాద
 రఘురామా! భక్తకల్పద్రుమా. 83

శా. ఏలా నా కటువంటిచింత గొన
 స్వామీ నేను నీసొత్తు నీ
వేలాగద్ది ప్రయోజనంపఱుప
 నా కేలా విచారంబు? సీ
తాలోలా ! యిటువంటి చింత నను
 శ్రద్ధాహీనుఁగాఁ దెల్పెడిన్
బాలుండన్ జడుఁడన్ విమూఢుఁడను
 దేవా! భక్తకల్పద్రుమా. 84

శా. నీకున్ నాపయిఁ బ్రేమ యుండినను
దండ్రీ ! నాగుణంబేలరా
నీకున్ నాపయిఁ బ్రేమలేనియెడఁ
దండ్రీ నాగుణంబేలరా
నీకారుణ్యము పెంపు నీమహిమలన్
నీ వెంచి రక్షింపుమీ
నాకాలుష్యము నెంచఁ బోకు
రఘుచంద్రా! భక్తకల్పద్రుమా ! 85

మ. ననుఁ బోల్పాపుఁడు దుశ్చరిత్రుఁ
డిలలోనం గల్గకున్నంత నో
యనఘా నీకరుణారసంబు కరణంబై
యొప్పు నీకున్ మదిన్ ;
ధనమున్ దాతృత గల్గి యేమిటికి
విత్తం బింత యాచించుని
ర్ధనుఁడున్ భూమిని గల్గఁడేని?
రఘుచంద్రా ! భక్తకల్పద్రుమా ! 86

శా. మందేహుండను* గాన నీకరుణకుం
బాత్రుండనో కానొ యన్
సందేహంబున మ్రగ్గువాఁడ;
నినవంశా ! ప్రేమ లేదేని నీ
విందున్ రమ్మని నన్నుఁ బిల్చెదవె
లేరే ధాత్రి విత్తేశ్వరుల్
మందల్ నీగృహ ముద్ధరింప
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 87

మ. చలచిత్తుండను గామవృత్తుఁడను
దుశ్చారిత్రుఁడన్ క్షుద్రుఁడ
న్బలహీనుండ నకించనుండ జడుఁడన్
బ్రజ్ఞావిహీనుండ నీ
బలవత్ప్రేమకు నెట్లు పాత్రమయితిన్
భావింప లేనయ్య యా
వలనుం దెల్పవె యట్ల చేసెదను
దేవా ! భక్తకల్పద్రుమా ! 88

మ. తెలిసెన్ నీదగుచిత్తవృత్తి ననుఁ
దో తేరంగ నిచ్చోటికిన్
గలవానిం గొని తేర నీమహిమ
లోకంబందు నవ్యాప్తమౌ
వెలయున్ వానిసుకీర్తి; నీమహిమ
యుర్విన్ సంప్రకాశింపఁగా
బలధీహీనుని నన్నుఁ దెచ్చితిని
దేవా ! భక్తకల్పద్రుమా ! 89

శా. ఎన్నోయున్నవి సన్నిదర్శము
 లీకృత్యంబునన్ నీవు నా
మున్నై పోవుచుఁ దీర్పఁగా సకలమున్
 బోనేర్చితిన్ వెన్కయై
నన్నుం దీర్పఁగ నిట్టినాటకముఁ
 బన్నం జూచి తీరీతులన్
అన్నా రాఘవ యొంటిమిట్ట
 రఘురామా ! భక్తకల్పద్రుమా ! 90

మ. నలసేతూదములందు మున్గి, బదరీ
 నారాయణుంగొల్చి, గం
గల నన్నింటను దోఁగి, క్షేత్రములఁ
 గాంక్షన్ మెట్టి, చిత్రం బహో
గలుగన్ నేరనిశాంతి త్వచ్చరణ
 యుగ్మంబుం గనం గల్గె ని
శ్చలతత్త్వం బిట నొంటిమిట్ట
 పురవాసా ! భక్తకల్పద్రుమా ! 91

మ. పురుహూతార్చిత ! నారికేళకలంబుం
 గొంచు భిక్షించి నే
యగువొప్పున్ గొని వచ్చినట్టియల
 ధాన్యంబున్ మహాభక్తితో
గురుసంశ్రద్ధను బువ్వ చేసి యిడు
 నీకు న్నాదుతోఁబుట్టు వు
త్తరరాగంబున సీతమాంబ
 రఘుచంద్రా ! భక్తకల్పద్రుమా ! 92

మ. శతవారంబులు మీఁద నెన్మిదియునౌ
 సారుల్ భవత్కావ్యమున్
వ్రతినై సల్పఁగఁ జేసినాఁడవు గదా
 పారాయణంబున్, సుధీ
రత! నీయోగ్యత కర్హమైనవిధి
 సామ్రాజ్యాభిషేకంబు స
న్మతి గైకొమ్మిపు డొంటిమిట్ట
 రఘుచంద్రా భక్తకల్పద్రుమా ! 93

శా. ఆయాచేంద్రుఁడు మోసగించెఁ గద
 మిథ్యావాదియై యాపయిన్
నా యండుం హరియించె నీధనములన్ ;
 దచ్ఛిష్యుఁడౌ కొండఁడున్
జేయంగ ల్గెను మోస ; నేపగిది నేఁ
 జేయంగ నీ భుక్తికిన్ ?
మాయావాదుల* నమ్మ మేల్గలదె
 రామా ! భక్తకల్పద్రుమా ! 94

శా. నీసంకల్పము నే నెఱుంగుకయె
    తండ్రీ ! యెగ్గులం బల్కితిన్
వీసంబైనను బాపదానమును నే
    వేళం గ్రహింపంగ నీ
వాసంజేయవు నేను గోర
    సకలజ్ఞా ! గావునన్ దావక
గ్రాసార్థంబు గ్రహింపవైతి
    రఘుచంద్రా ! భక్తకల్పద్రుమా 95

శా. లేరా భక్తులు భక్తురాండ్రు ధరలో
    లేరా సుపుణ్యా త్మకుల్
లేరా దాతలు నీకు భుక్తి నిడఁగా
    నే లేమిడిం జిక్కినన్
ఈరా చేరెఁడు బియ్యమైన జనకా !
    యే భిక్ష మెత్తం జనన్
రారా పేల కుదాతతోడ
    రఘుచంద్రా భక్తకల్పద్రుమా ! 96

మ. తలమా నాదగుమౌఢ్య మెన్న
    రఘునాథా నిన్ను రక్షింప నా
తలపై భారము పడ్డయట్లునగతున్
    ద్భద్రక్ష్యుఁడన్ నీకు నా
తలఁదన్నంగలవారు వేలకొలఁదుల్
    ద్భద్భృత్యు లున్నారు గా
వలవంతం బడనేల నాకు
    రఘుదేవా భక్తకల్పద్రుమా ! 97

మ. కృప భావింపుము నీవు నాకిడినఁ
    దండ్రీ ! విత్తవిద్యాదులన్
జపతత్వం బొకయింతలేకమమతన్
    సర్వంబు నీవారికిన్
ఉపకారంబగు నీదుకార్యములనె
    నీత్యోత్సాహినై తీర్పఁగాఁ
దపనీయాంబర ! యొంటిమిట్ట
    రఘునాథా భక్తకల్పద్రుమా ! 98

మ. *శ్రుతులం గోల్పడె బ్రహ్మ, కూటి
    కొఱకై శుష్కించి రీక్ష్మాబుధు
లిక్షితి మున్గెన్ విపదబ్ధి హేమకశిపుల్
    పీడించెదర్ సజ్జన
ప్రతతిన్ లక్ష్మి విదేశ మేగె
    బలగర్వప్రోద్ధతుల్ భూమిపుల్
హతరక్షోధిప యొంటిమిట్ట
    రఘురామా భక్తకల్పద్రుమా ! 99

మ. అవతారంబుల నెత్తినాఁడవఁట
రామా ! పూర్వ మొక్కొక్క హే
తువు గల్గంగ నొకొక్కవేళ యిపుడో
తోరంబులై యల్లహే
తువు లెల్లన్ సమకూరె నొక్కపరి
నెందో యెప్పు డేయాకృతిన్
అవతారంబు వహింతొ తీర్ప
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 100

శా. నీకై భిక్షము నెత్తువేళ జనకా
నేఁ బడ్డ పాట్లన్నియున్
నీకే వేద్యము; మేళ్లనుం గలవు
సందేహంబు లే దింతయున్
నీకైంకర్యము కోసరంబ యయినన్
నింద్యంబ విత్తేచ్ఛ, నా
యాకూతం బిది యొంటిమిట్ట
రఘురామా భక్తకల్పద్రుమా ! 101

మ. అడుగం, గోజను, నాకుఁగా నిడిన
నే నంగీకరింపన్, శ్రమం
బడరం జింతిల, గౌరవంబు లవమే
నాశింప, లే దన్నచో
సడలం, బిల్వకపోవఁ, దుష్టి గొనుదున్
స్వల్పంబునన్, సౌఖ్యముం
బడినన్ నీచమ విత్తకాంక్ష
రఘురామా ! భక్తకల్పద్రుమా ! 102

శా. ఆనాఁ డల్లయయోధ్యలోన నినుఁ
గన్నారం గన లేనిశ్రీ
హీనుల్ నేఁ డిట నిన్నుఁ గాంచుటను
దా మెత్తంగఁ బోరుర్విపై
క్ష్మానాథా తనువుల్, నిజంబు మరలన్
సందగ్ధసర్వాఘులై
నానాకర్మలు నొంటిమిట్ట
రఘుచంద్రాభక్తకల్పద్రుమా 103

మ. శతమున్ మీఁదను నొక్కయెన్మి దగు
నీసత్పద్యముల్, కాండనాం
చితముల్ మంగళసూత్రహారములు
సుశ్రీయుక్తపట్టోత్సవాం
కితముల్ కాసులపేర్లు గైకొనుఁడు
రక్తిన్ సీతయున్ నీవు స
మ్మతిమై నూత్నకిరీటయుక్తముగ
రామాభక్తకల్పద్రుమా 104

మ. *జతసంవత్సర మేగుచున్న దిపుడో
జ్యాకన్యకానాథ ! నే
క్షితిపై జన్మము నెత్తి నీచరణ
పంకేజాతముల్ నీదునా
నతి నేఁ గొల్చితి భిక్షకుండ నగుచున్
ద్వన్మందిరోద్ధారణో
న్మతి రత్నాబ్ధము లొంటిమిట్ట
రఘురామాభక్తకల్పద్రుమా 105

మ. జవసత్త్వంబులు లేవు మున్పటివలెన్
సంచారముం జేయఁ, జే
రువ యౌచున్నది వ్యాఘ్రమట్లు జరయున్
గ్రూరంబుగా, జానకీ
ధవ! వాగ్ఘస్తమనంబులం దిరుఁడనై
త్వద్దాస్యముం జల్ప దా
నవవైరీ జనియించెఁ గోర్కి
రఘుచంద్రాభక్తకల్పద్రుమా 106

మ. జయమౌ శ్రీశుఁడు వాసుఁడయ్యు ధరఁ
గౌసల్యాజవాదుండవై
దయకుం తావయి సత్యశీలివగుచున్
ధర్మంబు స్థాపింప దు
ర్ణయులం గూళల సంహరించి ప్రజలన్
రక్షించి సంత్యాగివై
అయముం గూర్చితి జీవకోటులకు
రామా భక్తకల్పద్రుమా 107

మ. సమముం జెప్పఁగ రానియట్టిది భవ
త్సామ్రాజ్యపట్టాభిషే
కమహం బిప్డు ప్రమోదవత్సరమునం
గావించి ధన్యాత్ముఁడై
దమసంపన్నుఁడు వాసుదాసుఁడు భవ
త్పాదాబ్జచింతారతుం
దమలాసక్తిని బల్కె దీని
రఘురామాభక్తకల్పద్రుమా 108

==========

## వావిలికొలను సుబ్బరాయకృత గ్రంథములు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణము, 4-వ కూర్పు విశేష లఘుటీకతోడ రెండుపుటములు మునుపటికంటె జక్కఁగ సవరింపఁబడినది. .. .. .. .. | 8 | 0 | 0 |
| మూఁడుసంపుటములు .. .. .. .. .. .. | 10 | 0 | 0 |
| ఏడుసంపుటములు .. .. .. .. .. .. | 13 | 0 | 0 |
| శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణములోని సుందరకాండము మాత్రము .. .. .. .. .. .. | 1 | 0 | 0 |
| కృష్ణావతారతత్త్వమంతయుఁబ్రత్యేకపీఠికగాఁగల 4-వ భాగము .. .. .. .. .. .. | 2 | 4 | 0 |
| (ఇది నూతన వచన మహాగ్రంథము. నానా పురాణేతిహాసములఁగల కృష్ణ చర్య యిందు సమకూర్పఁబడినది. సమస్తాంధ్ర స్త్రీ పురుషులకు నవశ్యపఠనీయము. ఇందుఁ జిత్రపటములు గలవు) పై నాలుగు భాగము లొక్కమారుగఁ గొనువారికి అట్టబైండులో 7-8-0 మాత్రమే. | | | |
| ఈపేరితోఁ గొందఱు వేఱుపుస్తకము లమ్ముచున్నారు. కొనువారు జాగ్రత్తగలిగి యుండవలయును. | | | |
| శ్రీ కుమారాభ్యుదయము, 2-వ కూర్పు, (రంగుకాగితము) .. | 1 | 0 | 0 |
| సుమనోల్లాసము, పైదానికి టీక .. .. .. .. .. | 0 | 8 | 0 |
| శ్రీకౌసల్యాపరిణయము, 2వ కూర్పు, పెద్దయక్షరములు (నిండుకాలికో) .. .. .. .. .. .. | 1 | 4 | 0 |
| t సుభద్రావిజయము, 3-వ కూర్పు, (నిండుకాలికో) .. .. | 1 | 0 | 0 |
| కౌసల్యాపరిణయము టీక ప్రథమాశ్వాసము .. .. .. | 0 | 12 | 0 |
| కౌసల్యాపరిణయముతోడఁ దీసికొనిన .. .. .. | 0 | 6 | 0 |
| బమ్మెర పోతన నికేతనచర్చ .. .. .. .. .. | 1 | 0 | 0 |
| బమ్మెర పోతరాజ విజయము .. .. .. .. .. | 0 | 12 | 0 |
| N.B. ఈరెండును గ్రంథాలయముల వారికి 14 అణాల కీయఁబడును. | | | |
| బమ్మెర పోతనగీతములు, రామనుతి, కృష్ణనుతి, ఆంజనేయ దండకము .. .. .. .. .. .. | 0 | 1 | 0 |
| శ్రీవాసుదాసకీర్తనలు .. .. .. .. .. .. | 0 | 4 | 0 |
| శ్రీభక్తకల్పద్రుమశతకము .. .. .. .. .. | 0 | 4 | 0 |
| శ్రీకృష్ణమంజరి .. .. .. .. .. .. .. | 0 | 1 | 0 |
| బమ్మెర పోతనరత్నములు (కాలికోబైండు) .. .. .. | 0 | 14 | 0 |
| (ఇది భాగవతములోని మంచిపద్యము లన్నియు నేటి భక్తి నీతి స్తుతి వైరాగ్యాదులు తరగతులుగా విభజించి కూర్పఁబడినది. 500 కెక్కువ పద్యములు గలవు. ప్రత్యాంధ్రుఁడును నుదయమునఁ బఠింపఁ దగినది.) | | | |
| శ్రీకాళహస్తి మహాత్మ్యము, (ధూర్జటికవిప్రణీతము) 2-వ కూర్పు (నిండుకాలికో) .. .. .. .. .. .. | 1 | 4 | 0 |
| (సగముకాలికో) .. .. .. .. .. .. | 1 | 0 | 0 |
| భీమఖండము (శ్రీనాథప్రణీతము) (సగముకాలికో) .. .. | 1 | 0 | 0 |
| t సులభవ్యాకరణము, 7-వ కూర్పు, 1-వ భాగము .. .. | 0 | 11 | 0 |
| t ” 2-వ ” .. .. | 0 | 12 | 0 |
| t ” 3-వ ” .. .. | 0 | 9 | 0 |
| t ఆర్యకథానిధి 1-వ భాగము (నిండుకాలికో.) .. .. | 0 | 4 | 0 |
| ” 2-వ ” ” .. .. | 0 | 4 | 0 |

| | | | |
|---|---|---|---|
| " 3-వ " " .. .. | 0 | 4 | 0 |
| " 4-వ " " .. .. | 0 | 4 | 0 |
| " 5-వ " " .. .. | 0 | 5 | 0 |
| " 6-వ " " .. .. | 0 | 5 | 0 |
| " 7-వ " " .. .. | 0 | 4 | 0 |
| " 8-వ " " .. .. | 0 | 5 | 0 |

ఆర్యచరిత్రరత్నావళీ మాలికా గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| t హరిశ్చంద్రచరిత్రము (నిండుకాలికో) .. .. .. .. | 0 | 5 | 0 |
| t శకుంతల " " .. .. .. .. | 0 | 5 | 0 |
| t సావిత్రీ " " .. .. .. .. | 0 | 5 | 0 |
| t నల " " .. .. .. .. | 0 | 7 | 0 |
| భగవద్గీత ద్విపద .. .. .. .. .. .. .. | 0 | 8 | 0 |
| భగవద్గీత మంచి పట్టుఅట్ట బంగారుగిట్ట నీరు అంచులు .. .. | 1 | 4 | 0 |
| t హనుమంతునిచరిత్రము, 1-వ భాగము .. .. .. .. | 0 | 7 | 0 |
| " 2-వ భాగము .. .. .. .. | 0 | 7 | 0 |
| t సీత 3-వ భాగము (నిండుకాలికో) .. .. .. .. | 0 | 7 | 0 |
| t " 2-వ భాగము " .. .. .. .. | 0 | 7 | 0 |
| t " 3-వ భాగము " .. .. .. .. | 0 | 7 | 0 |
| రుక్మాంగదచరిత్రము " .. .. .. .. | 0 | 7 | 0 |
| వామన చరిత్రము " .. .. .. .. | 0 | 5 | 0 |
| బాలకహితచర్య (314 పుటలు) (నిండుకాలికో.) .. .. | 0 | 9 | 0 |
| కుమార హితచర్య .. .. .. .. | 0 | 9 | 0 |
| పతి హితచర్య .. .. .. .. | 0 | 11 | 0 |
| t కుమారీ హితచర్య .. .. .. .. | 0 | 5 | 0 |
| సతీ హితచర్య .. .. .. .. | 0 | 8 | 0 |
| గర్భిణీ హితచర్య .. .. .. .. | 0 | 10 | 0 |
| వైధవ్య ధర్మచర్య .. .. .. .. | 0 | 8 | 0 |
| దేవాలయప్రేక్షక హితచర్య .. .. .. .. | 0 | 1 | 0 |
| కుమార దండకము (శోకరసము) .. .. .. .. | 0 | 1 | 0 |
| ఆధునిక వచన రచన విమర్శనము, గ్రామ్యవాద ఖండనము .. | 0 | 2 | 0 |
| ఒంటిమిట్ట రఘువీరశతకము .. .. .. .. | 0 | 4 | 0 |
| ఆర్యవిద్యోపన్యాసము, (జాతీయ విద్యాభ్యాస పద్ధతులగుఱించి) .. | 0 | 8 | 0 |
| శ్రీరామనామమహాత్మ్యము .. .. .. .. | 0 | 4 | 0 |
| సీతోపదేశము .. .. .. .. .. | 0 | 4 | 0 |
| హనుమదాచార్యోపదేశము .. .. .. .. .. | 0 | 4 | 0 |
| దేవాలయతత్త్వము .. .. .. .. .. .. | 0 | 12 | 0 |
| శ్రీమదొంటిమిట్ట కోదండరామనామ మహాత్మ్యము .. .. | 0 | 12 | 0 |
| ముముక్షుహితచర్య 1-వ భాగము .. .. .. | 0 | 14 | 0 |
| " 2-వ " .. .. .. | 0 | 14 | 0 |
| రెండుభాగములు కలపి (కాలికో) .. .. .. | 2 | 2 | 0 |

t ఈ గుర్తువేసినది టెక్స్టుబుక్కు కమిటీవారివల్ల నంగీకరింపఁబడినది.

ఈ గ్రంథములు వలయువారు:-

1. శ్రీరామజయమందిరము, తిరువళిక్కేణి, మదరాసు.
2. కార్యనిర్వాహకుఁడు, వాల్మీకాశ్రమము, ఒంటిమిట్ట కడపజిల్లా, అని వ్రాసి తెప్పించుకొనవచ్చును

mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథనిలయం

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం,
రాజమహేంద్రవరము - 533101.
ఫోన్ : 0883 - 2462565
e-mail : mohanpublications@gmail.com

# మావద్ద లభించు గ్రంథములు



## వ్రత కథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ. 10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీవ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీవ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీకుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీవ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారు) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |

| | | |
|---|---|---|
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

